# గోలకొండపత్రిక

స్వభాను సం॥ మాఘ బ॥ ౮ గురువారము


## తిండికొలత

హైద్రాబాదు నగరంలోను వరంగల్‌నగరములోను "తిండికొలత [రేషన్] యేర్పాటుకానున్నదని ఆరు నెలలనుండి వింటున్నాను. ఇదిగో అదిగో అంటూ ఇంకా మూడు నెలలు నెట్టివేస్తే చిత్రం లేదు. భారత దేశంలోని కొన్ని పట్టణాలలో రేషన్ పని చేయుచున్నది కదా! ఆపనిలోని ఫలితాలేమిటో హైదరాబాదు ప్రభుత్వమువారు విచారించుకొనుట మంచిది. కేవలము మండల ప్రభుత్వాలనే విచారించితే పూర్తివివరము తెలియరాదు. కాకిపిల్ల కాకికేముద్దు. ఎవరిపిల్ల వారికిముద్దు. మండల ప్రభుత్వాలు తాము ప్రవేశపెట్టిన రేషన్ చెడిపోయిందనికాని దానిలో చాలా "కష్టనిష్ఠురములు" ఉన్నవనికాని ఎన్నడైనా అంటారా? అది ప్రకృతికి విరుద్ధము కావున ప్రజల అభిప్రాయమే ముఖ్యమైనది. ఆ స్త్రప్రయోగము చేసినవాడికి గురి తగిలిందా లేదా అనేదే గుర్తుగాని అది వ్యాధకలిగించినదా లేక చల్లగా ఉందా లేక ముద్దుపారిందా అనేది యెవరిపైన ప్రయోగింపబడినదో వారే సరిగా చెప్పేదానికి తగినవారు. తిండికొలతవలన సుఖము, లాభము తమకు కలిగినదా లేదా అని ప్రజలను విచారించవలెను.

బొంబాయిలో తిండి కొలతను ప్రవేశపెట్టినారు. అక్కడిజను లెందుకో యేమో చాలా అఘోరించుచున్నారు కష్టపడి ఈరానునుండి బార్లీ గింజలు తెప్పించి బొంబాయిలో అమ్మితే అవి గడ్డిగింజలు, కంచర గాడిదలు కూడా తినవు, మానోళ్ళలో యెందుకు కుక్కుతారు మహాప్రభో అని వారు గొంతు చించుకొని రంతులు పెట్టుతున్నారు. కాదోయి అవిచాలా బలవర్ధకమైనవిఅని ప్రభుత్వమువారంటే అట్లనా! అట్లైతే బలము ముఖ్యముగా సౌర్జన్య కవసరము కనుక వారికే యీ దివ్యవిలాయితీ యవధాన్యాని సాపాటుకు ఏర్పాటుచేసి మాదేశి గోధుమలే మా మొగానపార వేయరాదా అన్నదాతా! అని బొంబాయి సోదరులు మొర పెట్టుకొంటున్నారు. గోధుమలకథ అట్లుంటే మరి బియ్యంకథ యెట్లుందో? వరి యన్నం వండితే ముద్దయి పేడుకొనివస్తుంది ఇదేమి బియ్యమండి అని బొంబాయి ప్రజలు వాపోయిరి. అది యట్లుండగా సజ్జలు, జొన్నలు, చాలా బలవర్ధక ధాన్యాలుసుమా! బియ్యంతినే చచ్చు జనులంతా సజ్జలు, జొన్నలు తిని యెద్దులవలె వృద్ధికి రండీ అని ప్రచారం చేసిరి. కాని మూర్ఖప్రజ లరమచేసుకోలేదు! మాపెద్దలు, మా అవ్వతాతలు, మేమూ ఎన్నడూ తినని ఇప్పుడు తింటామా అని సనాతనంగా మాట్లాడినారు.

ఇతరనగరాలలో మద్రాసు కరాచీ, కలకత్తావంటి వాటిలో రేషన్ పనిచేస్తున్నది. అక్కడి కష్ట లెట్లున్నవో సరిగా తెలియదు. ఒక్క విషయం మాత్రము స్పష్టమే. రేషన్ ఏర్పాటు చేసిన ప్రభుత్వము ఎవ్వరికి కన్నా నాస్తి అనకుండా ధాన్యం సప్లయిచేయుటకు బాధ్యత వహించుతుంది. కాని కొన్ని ప్రాంతాలలో ధాన్యంలేక ఈరాను కంచర గాడిదల నోట మన్నుగొట్టి బార్లీ తెప్పించుట, లేక పుచ్చిన ధాన్యం, పేడుకొని ముద్దఅయ్యే వంటధాన్యం, లేక నానాగోత్ర ప్రవరాలతోకూడిన "కిచిడీసాంబల్ నంబరు నానక్రాం వగైరా వగైరా" సమ్మేళన ధాన్యాలు, రంగుకలపిన బియ్యం, ముక్కిన జొన్నలు, పుచ్చిన గోధుమలు, సప్లయిచేయుట సరికాదుకదా! ప్రభుత్వమువారు — వారు బ్రిటిష్‌ఇండియావారుకానీ దేశవాళీ మహారాజులుకానీ — తమ ప్రజల ఆరోగ్యమును కాపాడుటకు బాధ్యులు

మన భారతదేశములో రేషనుచే చెప్పరాని కష్టాలుకూడా కలుగవచ్చు హిందూ ముస్లింతగవులు, మనస్పర్ధలు, ద్వేషాలు ప్రబలి పాకిస్థాన్ ముదిరి ఐకమత్యము చెడిపోయియున్నది అట్టి స్థితిలో ఒక వర్గమువారు బలిష్ఠులై బలహీనులైన రెండవవర్గమువారిని కసికొద్ది కూడా కష్టపెట్టకుండా చూచుకొను పవిత్రబాధ్యత ప్రభుత్వముపై కలదని యీ వారివిషయములో చాలా మెలకువతో శ్రద్ధవహించియుండవలయునని యిక చెప్పనక్కరలేదు.

హైద్రాబాదు వరంగల్ నగరాలలో రేషనుఅగుటకు ముందు జనాభా పట్టీలను వ్రాసుకొనుచున్నారు. ఇందు వినోదవిషయాలు బయటపడగలవు. ఇదివరలోని జనాభాకాలమందుకూడా మత సంఖ్యను ఎక్కువగా చూపుటకు అందందు తప్పుడులెక్కలను ఇచ్చియుండినట్లు పత్రికలలో మొరబుడినవచ్చెను. అందెంత సత్యమో చెప్పగలవాడుంటే వానికే తెలిసియుండును. ఇప్పుడుతిండి కొరకు జనాభాతీసుకొనగా పూర్వపు మత జనాభాకు ఇప్పటి తిండిజనాభాకు తేడాలు బాగా కనిపించుతున్నవి. వరంగల్‌నగరంలో గతజనాభాలో ౬౦ వేలమంది లెక్కకువచ్చిరి. ఇప్పుడుతిండి జనాభాకు ౧౧౦ వేలు లెక్కకెక్కినారట. ఈ రెండేండ్లలో వరంగల్ చాలా సారవంతముగా వృద్ధికి వచ్చినదన్నమాట! అదేవిధముగా హైద్రాబాదులోకూడా లక్షమందియైనా యెక్కువగా కనబడితే ఎవ్వరున్నూ ఆశ్చర్యపడగూడదు

సాధారణముగా చిన్నప్పటినుండియు ఎవ్వరేభుక్తి కలవాటు పడినారో వారు దేనిననుఅను గ్రహించుటకుగాను ఈనాడు క్రొత్తవిధమైనతిండిని తినుటకు నేర్చుకోజాలరనుట ఎంతటి మొద్దుమనిషియైన యెరుగును. అట్టిచో తలాలుక ఇవ్వడుబియ్యంతక్కువ పడి సజ్జలు లేక జొన్నలు తినుమంటె దానిని జీర్ణించుకోలేక వైద్యులకు ముడుపులు చెల్లించుకోవలసివచ్చును. "అంగ్రేజీ వైద్యం" చేసే వైద్యులేమైనా "నాటువైద్యుల" వలె అగ్గువగా వస్తారా? పిస్వాముక్కు భిక్షుమిస్తే ఎంతఖర్చుఅగునో అంతమాత్రము చదివింపులైనా డాక్టర్లకు ప్రతికేసుకుచదివించుకోవలసివచ్చును! కావున రేషన్ చేసేఅధికారులు కాస్త జనులభోజనం అవసరాలను గుర్తించవలెను. హైద్రాబాదు నగరములో తిండ జనాభాకు గాను నీపేరేమి? నీభార్యపేరేమి? మీనాయన్నపేరేమి? నీపెండ్లాము తండ్రిపేరే

## సజ్జల ఆహారంవిలువ

శ్రీనిజాం రాజ్యములో సంవత్సరమునకు దాదాపు ౨ లక్షల టన్నుల సజ్జలు పండును. కాని సజ్జల ఆహారవిలువ ప్రజలకు తెలియక పోవుటచేత ఇందులో ఎక్కువ భాగము ఈ రాజ్యమునుండి ఎగుమతి యగుచున్నది.

పరిశోధించగా సజ్జలు బలవర్ధకమైన ఆహారదినుసని తెలిసినది సజ్జలు మిక్కిలి చౌకదినుసు. ఎంతటి బీదవారైనను ఉపయోగించ వచ్చును. సజ్జలు ఆకలి, విధముగాగ పక్వముచేయ బడుచున్నది. సరిగా వండినచో దీనితో రుచ్యమగు పదార్థములు తయారు చేయవచ్చును

మూడువిధములు ఉపయోగము ఇవ్వబడుచున్నది, (౧) పొట్టుతీసిన పిదప సజ్జలను బియ్యమువలె బియ్యమువలె వాడవచ్చును పొట్టు రెండు విధములుగ తీయవచ్చును. (అ) గింజ పెద్దదైనచో ౨ గంటలపాటు నీళ్లలో నానపెట్టి నలిపి పొట్టు తీయవచ్చును (ఆ) ఎక్కువ పరిమాణములో ఉన్నచో వీటిని ఎండబెట్టి విసిరించవలెను. తరువాత పొట్టు వేరుగా ఉండవలెను.

సజ్జలకు పొట్టుతీయుట చాల అవసరము. పలుకుపగిలి పోకుండా చూడవలెను. పలుకువండినచో వరిఅన్నమువలెనే రుచిగా ఉండును

(౨) సజ్జలను ఉపయోగించు మరొక విధము, సజ్జలను నీటిలో నానవేయుటకు బదులు వేయించి ఎండబెట్టవలెను తరువాత ఒక పెనములో ఇసుకవేసి అందులో సజ్జలను పేలాలుగా చేయవచ్చును. ఈ పేలాలను పిండిచేసి నీటిలోవడి పంచదారగాని, బెల్లముగాని వేసి తిన్నచో రుచిగా ఉండును

(౩) సజ్జలతో చపాతీలు, రొయ్యని బిసి త్రుంచి చేయవచ్చును. సజ్జపిండి వారంరోజులకు పైగా ఉంచినచో చెడగుణమును పొందును గావున అప్పుడప్పుడు తెలిసి కొనవలెను.

## సనదులేని ఇనాములు పంపకం పత్రిక

సనదులేని యినాములలో దత్తత అంగీకరించవచ్చునాఅను విషయము పరిష్కారములో ఉండెను. యీపరిష్కారములో యెన్నో యినాందారుల పంపకము వ్యవహారములు ఆపబడియుండెను. గస్తిని (౮) ౧౩౫౩ ఫసలీ ద్వారా ననుసరించి యినాములలో దత్తత అంగీకరించవచ్చునని యీ క్రిందివిధముగా ఆజ్ఞ అయినది.

౧ భుక్తము (స్వగోటు) ౧౩౩౩ ఫసలీకి ముందు [౬౦]సంవత్సరములు ఉన్నది మొదలి యినాంలు ఎల్లప్పటికి ఇవ్వబడినవని భావించబడి పంపకము అంగీకరించబడును.

౨ ఆ తరువాతకు ఫగోటుడది ఒకటి లేక రెండుతరములవరకు యినాం ఇవ్వబడిన ఆతరముల వరకు పంపక మంగీకరించబడును—

౩ ఇదివరకు సంస్కరించబడిన వ్యవహారములు మాత్రము పునర్విచారణ జేయబడజాలవు—

మీఅని వివరాలు బాగా వ్రాసుకొని సంతకాలు తీసుకొనిపోతున్నారు కాని మీరేమితింటారు. మీ యింట్లో బియ్యం ఖర్చాలేక జొన్నలు కూడానా లేక గోధుమలా, మీకు సజ్జలుకూడా యిస్తే అరిగించుకొంటారా లేక మీకు విరేచనాలుపెట్టునా అని విచారించుకొని పోరాదా? ఈ నాడు ఒకరియింట్లోఉండేవారు పోవచ్చును, లేనివారు అనగా కోడండ్లు బిడ్డలు యింట్లోవచ్చి రికాణా వేయవచ్చును వారికొరకు పైరవిచేయవలసివచ్చునా? ఆ పైరవీకే మెనాచేయి చాటుగా చేతికితగిలించే గ్రహచారముండునా? చదువురానివారు, బీదవారు ఎకచ్చేరికిపోయి యే మహాశయుని ఏభాగంలోవిచారించి దండగలు, లంచాలు, నష్టాలు, కష్టాలు, అవస్థలు ఉపవాసాలు లేకుండా తొందరగా తమయింటిలోని మార్పునుతెలిపి తిండి కొలతలో లెక్క వేయించుకొనుటలో సౌలభ్యముచే కూర్చవలసి యుంటుంది ఇట్టి వెన్నెన్నో చిక్కులు కొత్తకొత్త సమస్యలు, బయలుదేరుతూ ఉంటవి ఇప్పుడే గంజిలో ధాన్యాలు విప్రవినోదుల గారడీవలె మాయమైపోయినవి తెరచాటు వ్యాపారం చోరబజారుగిరాకీ వృద్ధిపొందుతూఉందని ఊరంతా అనుకొంటున్నారు ప్రభుత్వము చెవికి ఈ వదంతులు తగిలినవో లేదో!

## విజ్ఞానవర్ధని.

● మంగళవారం

గోలకొండ అంటే అందరున్నూ యెరుగుదురు మంగళవారమంటే అనేక దినమనుకొంటారు. కాని గోలకొండకు పూర్వంపేరు మంగళవారం అని చాలామందికి తెలియదు. గోలకొండ కోటబయుట చాలాగోరీలున్నవి ఆ కోకటి శేక్‌సాంభాయనది (౧౫౨౨ హి) దానిపై ఫార్సీశాసనమున్నది. ఇందిట్లు వ్రాసినారు "జన్నాడా పరగణాలోని మంగళ్వారం గ్రామము" ఈ మంగళవారములోని కోట "మంగాల్‌కోట" అనినట్లు "ఆసీన్ ఆలంగీరీ" అను ఫార్సీచరిత్రలో వ్రాసినారు. వరంగల్ రాజాదేవరాయల (గణపతిదేవరాయలు?) పూర్వికులు దానిని కట్టిరనియు, క్రీ. శ. ౧౩౬౫—౧౩౭౫ వరకు రాజ్యంచేసిన బహమనీసుల్తాను వరంగల్ రాజా దానిని నజరుద్వారా ఇచ్చివేసినట్లున్నూ క్రీ. శ. ౧౫౧౨లో కులీకుతుబుషా స్వతంత్రుడై దానిని తనరాజధానిగాచేసికొన్నట్లున్నూ ఫైఫార్సీచరిత్రలో వ్రాసినారు. ఖుతుబుషా దానికి మహమ్మద్‌నగర్ అని పేరుపెట్టెనుకాని గోలకొండనామమే యుండి నిలిచిపోయెను ఈ కోటయెత్తు ౮౦ అడుగులు, ఆవరణము ౪ మైళ్ళు, ౮౭ బురుజులుకలవు. ఒక్కొక్కటి ౫౦ లేక ౬౦ అడుగులయెత్తున్నది. ౮ పెద్దద్వారాలు కలవు.

● దమ్మిడీ మసీదు

హైద్రాబాదునగరములో టోలిమసీదు అనేకలదు. దానిని అబ్దుల్లా ఖుతుబుషాయొక్క మహల్దారైన మూసాఖాన్ అనువాడు కట్టించెను దానిని దమ్మిడీ మసీదు అనికూడా అంటారు మూసాఖానే మక్కామసీదు కట్టుటయొక్క పర్యవేక్షణ చేయుచుండెను. ప్రతిదినం మక్కామసీదుకైన ఖర్చును బట్వాడాచేయునప్పుడు ప్రతి రూపాయికి ఒకదమ్మిడీ పట్టుకొంటూఉండెను అట్టి దమ్మిడీలన్నిటిని కూర్చియుంచి టోలిమసీదు కట్టించెను.

## రెడ్డిహాస్టలు ఏజతోత్సవం విరాళములు

అల ంపూరుతాలూకా జిల్లాపురము గ్రామవాసులగు శ్రీయుత గోడుమూరు పుల్లారెడ్డిగారు ౩౦౦ రూ॥ కల్దారులవిరాళము గ్రహించినారును యీ ఆదే గ్రామవాసులగు శ్రీ తాకరెడ్డినారాయణరెడ్డి పటేలుగారు ౧౫౦ రూ॥ కల్దారులను గ్రహించినారు, పైదాతలకు ఆహ్వానసంఘమువారు తమ కృతజ్ఞతను వెల్లడించుచున్నారు

అలంపూరు తాలూకాలో అయిజగ్రామములో మా యీమే ౪౭౫౦౦ల రూపాయలచందాలను గ్రహించబడెను, ఈ ౦ దాంతవసూళ్ళకుగాను శ్రీయుత గడ్డంశేషిరెడ్డి దేశముఖుగారున్నూ శ్రీయుత సు ప్రతాపరెడ్డిగారున్నూ సహాయముచేసినందులకు వారికి ఆహ్వానసంఘమువారు కృతజ్ఞతా వందనములర్పించుకొనుచున్నారు మరియు సొంతపనిపై అలంపూరుతాలూకాలోని జిల్లాపురమునకు వెళ్ళియుండిన శ్రీయుత గడ్డంపల్లి రామకృష్ణరెడ్డి దేశముఖుగారి వాక్సహాయమాత్రముననే అచ్చట ఇంచుమించు ౨౫౦౦రూ॥ చందా లను గ్రహింపబడెను. శ్రీవారి సహాయాభిమానములకు ఆహ్వానసంఘము వారెంతయు కృతజ్ఞతాబద్ధులైయున్నారు.

## హిందూముస్లిం పెండ్లి

ఇండియన్ సోషల్ రిఫార్మర్ అనే వారపత్రికా సంపాదకులైన యస్. నటరాజన్‌గారు సోఫియాడురున్ సోభానీఅనుకొన్నను స్పెషల్ వివాహశాసన ప్రకారము పెండ్లాడినాడు.

## పూంజీ

సిపాత్ టాకీలో ఈదినంనుండి ప్రారంభమౌతున్న క్రొత్తటాకీ. ఇది పంచోలివారిటాకీ ఇదలి కథ కొత్తపద్ధతిపైనున్నది, దీనిలో రాగిణి, మనోరమా, బెలిఖుర్ అజ్మీల్ మోతీ మున్నగువారు ఇందు అభినయించినారు. ఇందలిహాస్యమే ఇందలి విశిష్టత కథాత్రమము వినోదకరముగానుండును.

## విగ్రహధ్వంసనము

నాసిక్‌జిల్లాలో మాసోల్ దగ్గరగు హాలున్నవి, అందు ౧౦౦ యే ళ్లకు పూర్వముండే చెక్కినసుందరమైనజైనవిగ్రహాలున్నవి, కొందరుసోల్జర్లుఅచ్చటికి వెళ్లి ఒకవిగ్రహంనాడు విగ్రహాలను నాశనము చేసి, ౧౭ విగ్రహాలముక్కలను భస్మముచేసివేసిరి, ఒక విగ్రహాన్ని రెండుతునకలుచేసిరి, రెంటిని పొడిపొడిచేసి కలిపిరాని, అవిగ్రహంలో జైనులు చాలా భక్తితో సేవించుచుండిరి,

### కలకత్తాలో చావులు

కలకత్తాలో ఆకటిచావు లింక నూజరుగుచునే యున్నవి, గతవారమొకదినమున ౭౦మందిచద్చిరి,

### సోఫియా కళాశాల

బొంబాయిలో సోఫియాకాలేజీఅను దానిని బాలికలకై క్రైస్తవులు నడుపుచున్నారు విద్యతోపాటు క్రైస్తవమత కూడా బోధించుచున్నారు ఇటీవల ఇద్దరుబాలికలను క్రైస్తవులలోగా చేర్చిరి అందుపై బొంబాయి హిందువులున్నూ పెద్దలున్నూ ఆ కళాశాలకు బొంబాయి యూనివర్సిటీయంనుండి తొలగించివేసిరి. ప్రకృతము చదువుచున్నవారికిబ్బందులు కలుగకుండా మూడేండ్లవరకు మాత్రము దానిసంబంధము నిలిపియుంచినారు

## శ్రీ. శే. సి. శకుంతలమ్మ సంతాపసభ

సికింద్రాబాదు జంక్షనుహాలులో ౬—౨—౧౯౪౪ తేదీ ఆదివారం సాయంత్రము హైద్రాబాదు సికింద్రాబాదుపురజనులచేపరోపకారిణిబాలికా పాఠశాల గౌరవ కూపరింటెండెంటుగారగు చదలవాడ శకుంతలమ్మగారి మరణముచే ఆమె కుటుంబీకులకు కలిగినదుఃఖములో పాల్గొనుటకును సేవిద్యకు, ఆమెగారు చనిపోవుటచే కలిగినలోటును వెల్లడించుటకును బహిరంగసభ జరిగెను. జస్టిసు శ్రీమాన్ ఆర్. యస్. నాయక్ గారు అధ్యక్షపదవి నలంకరించిరి.

శకుంతలమ్మగారి అకాలమరణముచే ప్రజలకు కలిగినవిచారమును వెలిబుచ్చుచు తీర్మానములు రేకగ్రీవముగ నామోదింపబడినవి. శ్రీ. శే. శకుంతలమ్మగారి తలిదండ్రులగు శ్యామరావు దంపతులకును, ఆమె భర్తగారగు సి. లోకనాథం నాయుడుగారికిని యీమె యితర కుటుంబీకులకును సానుభూతిని గనబరచుచు, సానుభూతితీర్మానములను వారికి అందజేయ తీర్మానింపబడెను. శ్రీ అధ్యక్షులవారు సభను భావగర్భితమగు యుపన్యాసముతో ముగించిరి (ఈ వివరములన్నియు ఇదివరకే ప్రకటింపబడినవి.)

స్థానిక ప్రభుత్వమువారు పాఠశాలయొక్క విద్యావిషయక కృషిని గమనించి, సుమారు ౧౫౦౦౦ రూప్యముల మంజూరు చేసిరి. శ్రీఅధ్యక్షులవారు శ్రీ రెసిడెంటుగారగు గౌ॥ కలనల్ గిబ్సన్‌గారితో సంభాషించినప్పుడు, శ్రీ రెసిడెంటుగారు విద్యా కృషి, విధానదానులరక్షణ కృషియంత ముఖ్యమైనదని సెలవిచ్చిరి, అధ్యక్షులవారు శ్రీ. శే శకుంతలమ్మగారి జ్ఞాపకార్థము స్మారకనిధికివారే స్వయముగా ౧౦౦ రూప్యముల విరాళమిచ్చిరి.

పాఠశాల ప్రస్తుతమున శ్రీయుత సి. రంగాచారిగారు, (గౌ. అధ్యక్షులు) రావుసాహెబు ఏ. వి. వీరస్వామి యం. బి, యిగారు (గౌ. కార్యదర్శి) మరియు శ్రీమాన్ ఆర్. కే. వాసుదేవ మొదలియార్లనికుమితసభచే నిర్వహింపబడుచున్నది.

## తెలుగుగ్రంథముల జాబితా

౧౯౪౪జనవరి నెలలో గ్రంథాలయము నిమిత్తము ప్రకటించ దలచినపుస్తకాలజాబితా ఇంకను పూర్తిగాతయారు కాలేదు, మార్చి నెలలోతప్పక యీవిధములవిషయ ప్రయత్నము జరుగుచున్నది. అనివార్యముగ జరిగినయీఆలస్యమునకు గ్రంథాలయ సంవర్ధాహాపలు క్షమింతురుగా పైపట్టిలో ఉన్నవినిమిత్తము తమగ్రంథములను మాకు పంపవలె గ్రంథకర్తలను, ప్రకాశకులకు మాదృష్టి తెల్పి పంపనముల.

పా. నాగభూషణం

ఆం. దే. గ్రం. సంఘము

# గోలకొండ గ్రంథాలయము

కావ్య కుసుమావళి

వేంకటపార్వతీశ్వరకవులు. రెండు సంపుటములు. ప్రతిసంపుటములో ఇంచుమించు ౫౦౦ పుటలు. వెల తెలుపలేదు. ప్రాప్తిస్థానం "ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్, రాజమహేంద్రవరము."

ఈసంపుటములను పైజంటకవుల షష్టిపూర్తి సమయమును పురస్కరించుకొని ముద్రించినారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు చక్కనిశైలితో చిక్కనిభావాలతో పీఠికనువ్రాసినారు. ఇందు శ్రీ వేంకటపార్వతీశ్వరకవుల పద్యకావ్యములన్నియు చేర్చినారు. ఏకాంతసేవ, బృందావనము మాత్ర మిందు చేరలేదు.

ఈకవులు చాలా ప్రసిద్ధులు. పాండిత్యమున కతీతప్రతిభ కలిగినవారు. శైలి మనోహరముగాను సులభముగాను ఉండునట్టిది మంచి పాండిత్య ప్రకర్ష కలిగినను దీర్ఘసమాసాలతో పాఠకులను వేదించు పద్ధతిని అవలంబించినవారు కారు. వీరికవితలో భావాలు తరంగాలవలె లేచిపడుచుండును. ఈసంపుటములను ముద్రించువారు పద్యభాగాల తుదిలో ఆదేసంవత్సరమున వ్రాయబడినో తెలిపియుండిన బాగుండును. మరియు ముఖ్యకథలున్నభాగాలకు అవసరమగుచో నాల్గు పరిచయవాక్యాలు వ్రాయించియుండిన బాగుండును.

ఈకాగితాల కరువుకాలములోను ఇంత పెద్ద గ్రంథాలను వెలువరించిన ఆంధ్రప్రచారిణి లిమిటెడు కంపెనీవారికృషి అభిమానము మెచ్చుకోదగినది. ఈముద్రణలో ఒక చిన్న లోపమున్నది. శ్రీ వేంకటపార్వతీశ్వరకవుల ఫోటోలను ముద్రించి వారిజీవితచరిత్రను సంగ్రహముగా ప్రకటించియుండిన బాగుండెడిది-ఇప్పటికిని మించినదిలేదు. ఇప్పుడిప్పుడే గ్రంథము వెలువడినందున ఈసూచనబాగని తోచినట్లయిన ముద్రించి గ్రంథముల వెంటఅనుబంధముగా గ్రంథములను కొనువారికియ్యవచ్చును. ఈ సంపుటద్వయము ప్రతిగ్రంథాలయములో తప్పక ఉండవలెను. ప్రతివిద్యావంతుడును తెప్పించుకొనవలెను.

---

శివపంచస్తవి

సంపాదకులు వేదశాస్త్రాదితీర్థవిద్యానిధిపండిత శ్రీచిదిరమఠంశ్రీవీరభద్రశర్మగారు,పుటలు౩౫౦ పైగా చక్కని అట్టబైండు. సుందరమైనగ్లేజు కాగితాలు. నాలుగుపటాలు వెల ౧-౮-౦ కల్దారు. లభ్యస్థానం. శివధర్మ గ్రంథమాల కార్యాలయం సజ్జన్‌లాల్ వీధి సికింద్రాబాదు

వెల చాలాతక్కువ అనవలెను. ఇందు పుష్పదంత మహిమ్న, మలయరాజ, దండి, హలాయుధస్తవములు, వాటి ప్రతిపదార్థము తెనుగులో వాటి తాత్పర్యము గొప్ప తెనుగుకవులచేతరచింపబడిన తెనుగు అనువాదపద్యాలు ముద్రింపబడినవి. శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారు తెనుగుఅర్థము టీకాతాత్పర్యాలు చాలా చక్కగాసులభముగా వ్రాసియున్నారు. వారి విపులమగుపీఠిక గ్రంథానికి వన్నెతెచ్చినది. ఈగ్రంథానికైన సర్వవ్యయములను అలంపూరు తాలూకాలోని ఉండవెల్లిగ్రామవాసులగు శ్రీదుంపల రామిరెడ్డిగారు భరించినారు. ఇది ప్రశంసాపాత్రమగువిషయము. ఇట్టి సద్గ్రంథాలకు ధనికులైనవారలంతా పోషకులై ప్రకాశమగుటకు సాయపడుట వారివిధి. రాష్ట్రములో పలువురు దొంగకవులు తప్పులతిస్కార గ్రంథాలువ్రాసి దాతలవద్దకువెళ్లి వారిచే నూర్లకొలది వ్యయముచేయించుచున్నారు. దాతలు తాము ద్రవ్యమిచ్చుటకుముందుగా ముద్రింపనున్నగ్రంథములు అర్హములైనవా కావా గ్రహించవలెను. ఈపుస్తకప్రకాశనమున కిచ్చినదాన ముత్తమదానము. సంస్కృతవాఙ్మయప్రియులు దీనిని చదువవలెను. శైవస్తోత్రాలైనను రామాయణమును శైవులుజదివినట్లుగా దీనిని వైష్ణవులుకూడా చదువవచ్చును. పండిత చిదిరెమఠము వీరభద్ర శర్మగారి యీ పరిశ్రమ, చాలా పొగడ్తకు పాత్రమై యున్నది.

---

నేటి చైనా.

కర్త, పింగళిపసుపు రామయ్యగారు. ప్రకాశకులు, సంస్కృతిగ్రంథమండలి, వరంగల్ బిల్డింగు పెరంబూరుపోస్టు మద్రాసు. పుటలు౨౬ వెల౧౦ అణాలు కల్దారు. భాషవ్యావహారికమైనా అన్ని ప్రాంతాలవారు సులభంగాగ్రహించేభాష, ఇందలి విషయాలు మనదేశములోని విద్యావంతులంతా తెలుసుకొనదగినవి. మనప్రక్కనే ఉన్న చీనావారు మనవలెనే అతిప్రాచీన సంస్కృతిగలవారు, మనవలెనే పరాధీనులైనా మనంతపరాధీనులు కాక స్వాతంత్ర్యానికి పోరుసలుపుచునేయున్నారు. అది యేవారిలోనిశక్తి. మనయందుచీనానాటక గాథనుగు ప్రేమనుఅభివృద్ధి అట్టివానిగూర్చి మనమున్నా విశేషముగా తెలుసుకొనుటకు చాలాఅవసరం అందుకీగ్రంథం చాలా సహాయపడుతుంది

---

## కట్టెల హుకుం

హైద్రాబాదు రాష్ట్రములో కట్టెలు బొగ్గులు చాలాతీవ్రమై దొరుకుట కష్టమైపోయింది. ప్రభుత్వంవారు గమనించి యిట్లుశాసించుచున్నారు ఇకముందు రాష్ట్రింబయటికి ఎవ్వరున్నూ కట్టెలను, బొగ్గులను ఎగుమతి చేయగూడదు వ్యతిరేకంగా వర్తించేవారికి మూడేండ్ల జెయిలు శిక్ష!

---

## జలవిద్యుత్తు

హైదరాబాదు రాష్ట్రములో జలవిద్యుత్తును ఉత్పత్తిజేసి గ్రామాలకుకూడా సప్లయిచేసి ప్రజలకును పరిశ్రమలకును సౌకర్యాలు కలిగింపనున్నారు కృష్ణ గోదావరీనదులనుండి కాలువలతీసి జలపాతముల నుత్పత్తిజేసి జలవిద్యుత్తును అగ్గువగా ఉత్పత్తిజేయుటకై పరిశోధనలుజేసి సూచనలుచేయుటకు కొందరి దొరాయించనీయర్ల నేర్పాటుజేసినారు; వారు కొన్నిస్థలాలుచూచి ఇదివరకే నివేదిక సమర్పించినారు.

---

## మళ్లీ చావులు పెరిగినవి

బెంగాలు కరువు పూర్తిగా తీరిపోలేదు, ఫిబ్రవరి ౪వతేదీనాడు కలకత్తా ఆసుపత్రిలో ౩౦ మందిని చావనున్నవారిని తీసుకొనిరి. అందు ౭ మంది చచ్చిరి- అనిమిషాల చచ్చినవారు గతవారముకలకత్తాలో ౧౨౩మంది- గతసంవత్సరము ఇదేవారములో ౬౫మంది చచ్చియుండిరి.

---

## ఇండియాలో పరిశ్రమల అభివృద్ధి

ఇండియాదేశములో మంచియినుము ఎక్కువగా దొరుకుటవల్ల ఈదేశంలో క్రొత్తగా ఇనుము, ఉక్కుపరిశ్రమ ఎక్కువగా అభివృద్ధిచెందినది. ఇప్పుడు అల్యూమినియం ఎక్కువగా చేయబడుచున్నది. జలశక్తి పోషించబడుచున్నది; విద్యుచ్ఛక్తి పరిశ్రమ వృద్ధిలోనున్నది. ప్రపంచములోకెల్ల పెద్దజలాశయముల నిర్మాణముచే ఇండియాలో మరి ౫కోట్ల ఎకరాలభూమి సేద్యమునకు యోగ్యమగుటవల్ల సాధారణ సమయాలలో ఇండియాకు ఆహారము సమృద్ధిగా చాలును—అని అమెరికాలో ఒకపత్రిక అభిప్రాయమిచ్చినది.

---

## హిందూస్థానీలమాటయేమి?

ఇప్పుడు అమెరికాదేశం హిందూస్థానం మిత్రమండలిలోచేరింది. చీనాకూడాఅదేమండలిలోను చేరింది. అనేకసంవత్సరములనుండి అమెరికా సంయుక్తరాష్ట్రములో ఏషియాఖండమువారు నెలవు తీసిది కాలుపెట్టగూడదను శాసనమున్నది. ఇది వారి కవమానకరమని అమెరికావారు ఇప్పుడు గ్రహించినారు- "మామిత్రులైనను వారికి అవమర్యాదకగూడదని అందుచేత వారిపై పెట్టిన ఆంక్షను తీసివేస్తున్నాము" అని కొన్నిరోజులక్రిందట అమెరికావారు తీసివేసిరి- మరి హిందూస్థానముమాటయేమి? హిందుస్థానీలుకూడా అమెరికాలో నెలవులేనిది కాలుపెట్టరాదుకదా! హిందుస్థానంలో ఆట్టిఆంక్ష అమెరికావారికి లేదుకదా, హిందూస్థానీ సైన్యాలు ఎంతశౌర్యముతో మన అమెరికావారితో కలసి యుద్ధం జేస్తున్నాము చూచినాము కదా వారిపైకూడా ఆంక్ష తొలగించవలెనని అమెరికాలో ప్రసిద్ధపత్రికలు వ్రాస్తున్నవి

---

విధురవీణ.

కవి. నల్లానిచక్రవర్తుల వెంకటాచార్యులుగారు ప్రకాశకులు. ఆంధ్రవాఙ్మయసేవాసమితి. సాక్యంచ పుటలు౫౦ వెల౩అణాలు.

వెలఅధికమే సగంవరకు తగ్గించవలెను. ఇందలి యుగీతములేఅంటేలో పమేమియు లేదు. పైగా రుచిరముగాఉన్నవి పటుత్వముబాగాఉన్నది.భావాలన్నినూతన్నములే. ఈ కవిసృదేకమున్నది "కవిను దేకమే గొప్పకారణంబు" అని వారిమొదటిగీత. గొప్పకీర్తి పొందిన కవిశేఖరులగు శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు చాలాచక్కని పరిచయవాక్యాలువ్రాసినారు. విధురవీణ అను పేరెందుకు పెట్టుకొన్నారో యేమో? అంతపరితాపమేలనో? కవిగారి కవితకుహృదయపూర్వకమగు స్వాగతమిస్తున్నాము.

---



## చందాదారులకు సూచన

మాకార్యాలయమునకు ఫిర్యాదుతో ఉత్తరములు వ్రాసేవారు తమ చందా నంబరున్ను రసీదు లేక రూపాయిలు చెల్లించిన తేదీ తెలుపవలెను. అట్టివాటికే జవాబు వ్రాయనగును. మా జవాబు కోరువారు జవాబుకారటుగాని స్టాంపులుగాని పంపినచో జవాబు వ్రాయబడును. మా ఉత్తరము ప్రకారము సవరించుకొనబడును-

ఇట్లు

మేనేజరు గోలకొండపత్రిక

చందా వివరాలు
సంవత్సరము చందా తపాలా ఖర్చులతో
ఆరు నెలలకు „ 3-10-0 „
విదేశాలకు ప్రత్యేకముగ కల్గారు
విడి ప్రతిక 0-1-3
పాత ప్రతిక వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

... only Popular Paper that reaches the masses in the Dominionns
BEST MEDIUM — FOR — ADVERTISEMENT

Vol. 18 — No 78 | Published on every Monday and Thursday· Hyderabad· Dn· | 17—2—1944

# మతశాఖవారి అత్యాచారము

## చుడీబాజారువారి లబ లబలు

మహాప్రధానిగారి దర్బారులో మొర

హైదరాబాదు నగరములోని చార్మినార్ హుసేనీ మొహల్లావారున్నూ, చుడీబజారువారును తమ తాత ముత్తాతలనాటి యిండ్లపై హైదరాబాదు పుట్టిననాటినుండి నేటివరకెన్నడున్నూ లేనట్టి నజూల్ అనే స్థలంపన్ను మతశాఖవారు వసూలు చేస్తున్నారు. ఇది అన్యాయం, నిరాధారం, అక్రమం అని మొరపెట్టుకొన్నారు. ఇందు ఇంచుమించు పైన ఉదహరించిన వాడలవారున్నూ, సొంత దాయిక విజ్ఞప్తిని [మెహజర్] ఇచ్చుకొన్నారు. అందలి విశేషాలిట్లున్నవి.

పూర్వమెప్పుడో హజరత్ అబూహసన్ సాహెబు (రహమతుల్లా) గారనే వలీగారు ఉండిరట. వారికి భక్తులుండిరట. ఒక భక్తుడు అతనికి యీ మొహల్లాలు దానమిచ్చివేసెనట అదెవ్వరికిని తెలియనిముచ్చట. అటుతరువాత బల్దియా జిల్లాకోర్టు నిగరానిలో ఆభాగాలు కొంతకాలముండెను. అప్పుడీ వాడలలోని యిండ్లపై [నుజూలు] స్థలంపన్ను వసూలు చేయవలసిందని కార్యకలాపము కాగితాల మీద జరిపించి కవిలె కట్టను (మిసల్) చేసియుంచిరట. తర్వాత మతశాఖవారు ఆకట్టనే ఆధారముగా చేసికొని యుజమాయిషీ తెందు స్థలంపన్నును అని వాడలలోని యిండ్లవారిపై తగాదాకు కూర్చున్నారు. వ్యవహారం సాగించినారు. డిక్రీలుపొందినారు. వాటిని తమకు నచ్చినవారిపై వదలినారు. నచ్చనివారిపై సాధించినారు. పోలీసువారి సహాయంపొంది యిండ్లలోదూరి సామానులను బయటికీడ్చి జప్తీచేసినారు ఇప్పుడు వాడల యిండ్లవారు కొన్ని ప్రశ్నలు వేస్తున్నారు.

అయ్యా ఈవాడలెవ్వరిసొమ్ము ఎవరమ్మినారు. ఇచ్చినవారికేమిహక్కు తీసుకొన్నవారికి మరేమీ అధికారము. తీసుకొన్నవారికి మతశాఖవారేమి కావలెను. ఎప్పుడినాముగా ఏర్పడింది దానికేమైనా సనదున్నదా? సనదు ప్రసాదించిన భక్తశిఖామణులెవ్వరు? ఆసనదుపైన తేదీ ముద్ర సాక్ష్యం వగైరాలున్నవా? ఈ 100 ఏండ్లనుండి స్థలంపన్ను ఎందుకు వసూలు చేయలేదు. ఇప్పుడు కొత్తగా వసూలుచేయవచ్చునా? ఇట్టి ప్రశ్న పరంపరలు వారు వేయుచున్నారు. ప్రభుత్వమువారి అనుగ్రహాన్ని యాచించుచున్నారు.

కరుణించండి మహాప్రభో, మేము బీదవారం తరతరాలుగా ఏపన్నులున్నూ లేక సుఖంగా మా యిండ్లలో నేమండినాము ఇప్పుడుకూడా మాకు అదేశాంతి అనుగ్రహించండి అని పరిపరి విధాలావాపోవుచున్నారు.

---

# ఆంధ్ర మహిళామహాసభ స్థాయిసంఘము

2-10 ఫిబ్రవరి గురువారము సాయంత్రము 4 గంటలకు శ్రీమతి రంగమ్మ ఓబలరెడ్డిగారి గృహమందున స్థాయిసంఘ సమావేశము జరిగెను. దీనికొరకు వరంగల్ నుండి శ్రీ. కనకరత్నమ్మగారు, కొలనుపాకనుండి శశిరేఖగారు వచ్చినారు: నల్లగొండ బీబీనగర సంఘములనుండి లేఖలువచ్చినవి. ఈక్రింది కార్యక్రమము జరిగెను.

శ్రీమతి రంగమ్మ ఓబల్‌రెడ్డిగారు ఆర్థికవిషయములను మాట్లాడుచు మన మహిళాసభ పక్షమున బీదజన ఆహారపదార్థ నిమిత్తమై రుద్రమదేవి నాటకము వేసి యువరాణీగారు రు1000 ఇచ్చినట్లు చెప్పిరి. దీనికొరకు ఖర్చుపెట్టిన ధనమును త్వరలో భర్తీచేయుదుమనిచెప్పిరి. ఈఖర్చులనిమిత్తమై మహిళాసభ పోషకురాలగు గురుగుంట్ల రాణీగారు 300 రూపాయిలు విరాళమిచ్చినారనియు చెప్పిరి.

ఈసంవత్సరము సభ చేయవలయునా? వద్దా? అను విషయముపై శ్రీమతి రంగమ్మ ఓబల్‌రెడ్డిగారు మనముమహిళా సభను మహాసభనుండి విడదీసినాము మరియు ఈ సంవత్సరము మహాసభ చేయుటకు లేదు గనుక మనము మహిళాసభను చేయవలయుననిరి జిల్లాలనుండి వచ్చిన స్త్రీలుమాత్రము స్థాయిసంఘ తీర్మానమునకు బద్ధులైరి.

సంఘం లక్ష్మీబాయమ్మగారు ఈతీర్మానమునకు వ్యతిరేకముగా మాట్లాడుచు ఆర్థిక పరిస్థితులను అనుసరించి మనము ప్రత్యేకముగా సభను జరుపజాలమనిరి, ఆరుట్ల కమలాదేవిగారు తీర్మానమునకు వ్యతిరేకముగా మాట్లాడుచు జిల్లాలనుండి స్త్రీలు ఒంటరిగా సభకు రాజాలరనియు, పురుషులు తమ స్త్రీలను వెంటరాగా పంపరనియు కనుక ఆంధ్రమహాసభ జరుగునప్పుడేమనముకూడా జరుపుదామని మాట్లాడినారు.

శ్రీమతి రంగమ్మగారు పైచర్చలకు జవాబుచెప్పుతూ తప్పకుండా ఈసారిమనము హైదరాబాదులో చేద్దాము తమ సర్వశక్తులను ధారపోసి సభను జరుపుటకు పూనుకుంటామని చెప్పిరి.

అన్యతీర్మానాలు ఓటునకు పెట్టగా అధిక సంఖ్యాకులచే తీర్మానము ఆమోదింపబడెను. ప్రతినిధులకు సీతాకుమారిగారి ఇంట్లో బస ఏర్పాటుచేసినారు. శ్రీమతి రంగమ్మగారిఇంట్లో స్థాయిసంఘ సభ్యులకు విందు చేసినారు

ఇట్లు కార్యదర్శిని
ఆరుట్ల కమలాదేవి

---

# నిరోధాజ్ఞ

హైదరాబాదు ప్రభుత్వమువారిట్లు తెలుపుచున్నారు. ఆరునెలలవరకు వరంగల్ జిల్లాలోనికి రాకుండా ఉండకుండా పమిదేర్‌పల్లి రామనాథకా సత్యము ఇబ్రహీంగారలకు ఆజ్ఞలీయ్యబడినవి. ఈ ఆరునెలలకాలములో పైవారు ఏకూలీల సంఘాలలోను సంబంధము కలిగించుకోకూడదు. చాల ఆలోచించిన తర్వాతనే ప్రభుత్వమిట్లాజ్ఞాపించినది పరిశ్రామిక వర్గంవిషయమున ప్రభుత్వానికి చాల సానుభూతికలదు. వారి న్యాయమైన కోర్కెలను తీర్చుటకు సిద్ధమే. గతమొహరం (ఆగస్టు) నుండి అజాజాహీ మిల్లులలో ఎడతెగకుండా ఇబ్బందు లేర్పడుచు వచ్చినవి నోటీసు లేకుండా సమ్మెలుజరిగినవి ఎంత ఓర్పుపట్టినా ఇవి నిలువక ఇంక సమ్మెలుజరుగుచునేయున్నవి అందుచేత ఈ యాజ్ఞ యివ్వవలసివచ్చినది.

... ... ...

కలరా యొక్క వైనంమున పట్లీలో మహాశివరాత్రి జాతర స్థానికముగాయుండును. ఇతరులు పోరాదుఅని ప్రభుత్వము తెలుపుచున్నది.

... ... ...

ఈసంవత్సరం ఆదిలాబాదుజిల్లా సర్కారీసభ వరంగల్ సుబేదారు అధ్యక్షతను 8,9 ఖుర్దాదు తేదీలలో నిర్మలులో జరుగును

... ... ...

హైదరాబాదు కర్రవర్తకులు రూ 891 హాలీం హైదరాబాదునగర ఆంధ్రజనసంఘముద్వారా బెంగాలు క్షామనిధికి పంపిరి

... ... ...

---

హైదరాబాదు ప్రధానామాత్యులగారు 11 ఫిబ్రవరినాడు పర్భణిలోయుండిరి. అచ్చటినుండి జింతూరు, చండా, లోరీ మొన్నగుగ్రామాదులకు మోటారులో వెళ్ళిరి. గ్రామజనులతో మాట్లాడిరి. అక్కడినుండి వారు తిరిగి హైదరాబాదుకువచ్చిరి. పర్భణిలో నుండినప్పుడు వారిలో మహారాష్ట్రపరిషత్తుసభ్యులను ఇత్తెహాదువారును కలిసిమాట్లాడిరి.

... ... ...

కిమా గంటలో 10-2-44 నాడు, (శ్రీసావిత్రి) కన్యాపాఠశాలలో మహిళాసభ సమావేశము శ్రీమతి రంగమ్మ ఓబల్‌రెడ్డిగారి అధ్యక్షతన జరిగెను. శ్రీమతి రంగమ్మగారు, శ్రీమతి సీతాకుమారి, రత్నమ్మ స్కూలు ప్రధానోపాధ్యాయురాలు; కమలాదేవిగార్లు ఉపన్యసించిరి. కొందరు స్కూలు బాలికలు పాటలు పాడిరి. కోలాటముచేసిరి. అక్కడి సంఘమునకు శ్రీమతి ఉత్తరదేవిగారినిప్రతినిధిగా పెట్టినారు.

ఆంధ్ర యువతీమండలిని మహిళాసభకు నగర సంఘముగా మార్చియుండిరి, ఆమండలిమహిళాసభ 20 ఫిబ్రవరి సాయంత్రము 3గంటలకు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమున జరుగును. నూతన సంవత్సరమునకు ఎన్నికలు, ఆల్పాహారవిందు జరుగును. కనుక ఈ సమావేశమునకు నగరములోని అన్ని ప్రాంతములలోని మహిళాసభ సభ్యురాండ్రను తప్పకవచ్చి పాల్గొనగలరని కోరుచున్నాము.

ఇట్లు కార్యదర్శిని
ఆరుట్ల కమలాదేవి

... ... ...











Printed and Published by ...makrishna Reddy at the Golkonda Power Press, Hyderabad-Dn Editor S. Prathap Reddy, M.A., B.L